-మక్రోధాదులును) త్యాగ=విడుచుటయే, కలాప=భూషణములుగా గలవాఁడా, ...త్య... ద్వ్యాప-నిత్య=శాశ్వతమైనట్టి, సుఖ=ఆనందరూపమైనట్టి, సంవిత్=పరబ్రహ్మరూప మగుజ్ఞానమునందు, వ్యాప=వ్యాపించియున్నవాఁడా (లేక జ్ఞానము నాత్మస్వరూపముగాఁ జెందినవాఁడా), శుద్ధా... పాప-శుద్ధాత్మ=నిర్మలమగు మనస్సుకలవాఁడా, శశ్వత్=అపరిమితమైన, తేజః = ఆత్మప్రకాశముచేత, అభిహత = కొట్టఁబడిన, అది=అనాదియైన (లేక, మొదటినుండి వచ్చుచున్న,) పాప = పాపము కలవాఁడా (లేక, అజ్ఞానముగలవాఁడా) సుజ... ప్రాపకా-సుజన=సత్పురుషులయొక్క, ఇష్ట=ఇష్టమును, ప్రాపక=కలుగఁజేయువాఁడా, వ్యాపకా=సర్వవ్యాపకుఁడా !

క. ప్రణవాత్మక! సదసత్కారణ ! సంపూర్ణప్రభాభిరామ ! సగుణ ! ని
ర్గుణ ! నిర్వికార ! నారాయణ ! సీతారామగురుమహాదేవ! శివా !.

టీ. ప్రణవాత్మక=ఓంకారరూపుండ, సదసత్కారణ=నేత్రములకు గోచరములగు భూతములకును, అట్లు కాని వాయ్వాకాశములకును కారణభూతుఁడ, సంపూర్ణ=సర్వపరిపూర్ణమయిన, ప్రభ=కాంతిచేత, అభిరామ=మనోహరుఁడా!, సగుణ = గుణవంతుఁడా', నిర్గుణ = గుణరహితుఁడా', నిర్వికార = పుట్టుక మొదలగు వికారములు లేనివాఁడా!, నారాయణ=పరబ్రహ్మస్వరూపుఁడా!, శివా = ఆనందస్వరూపుఁడా! సీతారామగురుమహాదేవ-సీతారామ = సీతారామరూపుఁడవైన, గురుమహాదేవ=మహాదేవాచార్యా.

మాలిని. ఘనతరసువివేకా ! కల్పితాశేషలోకా !
వినమితబుధలోలా ! విశ్వవిఖ్యాతలీలా !
జననుతగుణతంత్రా ! సర్వతంత్రస్వతంత్రా !
మునిసరసిజమిత్రా ! మోక్షలక్ష్మీకళత్రా!. 193

టీ. ఘనతర... వేకా-ఘనతర=మిగులశ్రేష్ఠమైన, సువివేకా=అపరోక్షజ్ఞానము గలవాఁడా, కల్పి... లోకా-కల్పిత=సృజింపఁబడిన, అశేష=సమస్తములగు, లోకా=లోకములుగలవాఁడా, విన... లోలా-వినమిత=నమ్రులైన, బుధ= పండితులయందు, లోలా=ఆసక్తిగలవాఁడా, విశ్వ... లీలా-విశ్వ=ప్రపంచమునందు, విఖ్యాత=ప్రసిద్ధమైన, లీలా=విలాసములుగలవాఁడా, జన... తంత్రా-జన=లోకముచేత, నుత=స్తోత్రముచేయఁబడిన, గుణ=త్యాగము భోగము మొదలగుగుణములే, తంత్రా=పరివారముగాఁగలవాఁడా, సర్వ... తంత్రా-సర్వతంత్ర=సమస్తశాస్త్రములందును, స్వతంత్రా=కర్తృత్వము గలవాఁడా! ('తంత్రం స్వరాష్ట్రచింతాయాం తంతువాయేపరిచ్ఛదే, యాగప్రయోగసిద్ధాన్తేశాస్త్రే' అనిరత్నమాలానిఘంటువు), ముని... మిత్రా-ముని=ఋషులనెడి, సరసిజ=కమలములకు, మిత్రా=సూర్యుఁడైనవాఁడా! మోక్ష... కళత్రా-మోక్షలక్ష్మీ=మోక్షసంపదయే, కళత్రా=భార్యగాఁగలవాఁడా!,